# అథ సప్తదశోऽధ్యాయః

# సృష్టి వర్ణనము

వాయురువాచ |

ఏవం లబ్ధ్వా పరాం శక్తిమీశ్వరాదేవ శాశ్వతీమ్ | మైథునప్రభవాం సృష్టిం కర్తుకామః ప్రజాపతిః || 1

స్వయమప్యద్భుతో నారీ చార్ధేన పురుషోऽభవత్ | యార్ధేన నారీ సా తస్మాచ్ఛతరూపా వ్యజాయత || 2

విరాజమసృజద్బ్రహ్మా సోऽర్ధేన పురుషోऽభవత్ | స వై స్వాయంభువః పూర్వం పురుషో మనురుచ్యతే || 3

సా దేవీ శతరూపా తు తపః కృత్వా సుదుశ్చరమ్ | భర్తారం దీప్తయశసం మనుమేవాన్వపద్యత || 4

తస్మాత్తు శతరూపా సా పుత్రద్వయమసూయత | ప్రియవ్రతోత్తానపాదౌ పుత్రౌ పుత్రవతాం వరౌ || 5

కన్యే ద్వే చ మహాభాగే యాభ్యాం జాతాస్త్విమాః ప్రజాః | ఆకూతిరేకా విజ్ఞేయా ప్రసూతిరపరా స్మృతా || 6

స్వాయంభువః ప్రసూతిం చ దదౌ దక్షాయ తాం ప్రభుః | రుచేః ప్రజాపతిశ్చైవ చాకూతిం సమపాదయత్ || 7

ఆకూత్యాం మిథునం జజ్ఞే మానసస్య రుచేశ్శుభమ్ | యజ్ఞశ్చ దక్షిణా చైవ యాభ్యాం సంవర్తితం జగత్ || 8

స్వాయంభువసుతాయాం తు ప్రసూత్యాం లోకమాతరః | చతస్రో వింశతిః కన్యా దక్షస్త్వజనయత్ప్రభుః || 9

వాయువు ఇట్లు పలికెను -

ఈ విధముగా ఈశ్వరునినుండి సర్వశ్రేష్ఠము, శాశ్వతము అగు శక్తిని పొంది, ప్రజాపతి స్త్రీ పురుషసమాగమము వలన కలిగే సృష్టిని చేయగోరెను (1). అద్భుతశక్తి గల ఆయన తానే స్వయముగా సగము పురుషుడు, సగము స్త్రీ అయెను. ఏ అర్ధభాగముచే ఆయన స్త్రీ ఆయెనో, ఆ భాగమునుండి శతరూప ఉద్భవించెను (2). ఆయన అర్ధభాగముచే పురుషుడై విరాట్ ను సృష్టించెను. సృష్ట్యాది యందలి ఆ పురుషుడే స్వాయంభువమనువు అని పిలువబడినాడు (3). ఆ శతరూపాదేవి మిక్కిలి కఠినమగు తపస్సును చేసి, ఉజ్జ్వలమగు కీర్తి గల మనువునే భర్తగా పొందెను (4). ఆయనకు శతరూపయందు పుత్రులు గలవారిలో శ్రేష్ఠులగు ఇద్దరు కొడుకులు కలిగిరి. ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనునవి వారి పేర్లు (5). వారికి మహాసాధ్వులు అగు ఇద్దరు కన్యలు కూడ కలిగిరి. ఒకామె పేరు ఆకూతి. రెండవ ఆమె పేరు ప్రసూతి. ఈ ప్రజలు వారిద్దరి నుండియే పుట్టిరి (6). స్వాయంభువమను మహారాజు ప్రసూతిని దక్షునకిచ్చెను. ఆ ప్రజాపతి ఆకూతిని రుచికి ఇచ్చి వివాహము చేసెను (7). బ్రహ్మమానసపుత్రుడగు రుచికి ఆకూతి యందు యజ్ఞము, దక్షిణ అనే శుభకరమగు ఇద్దరు సంతానము కలిగిరి. వారిద్దరి వలననే ఈ జగచ్చక్రము తిరుగుచున్నది (8). దక్ష ప్రజాపతి స్వాయంభువుని కుమార్తెయగు ప్రసూతియందు లోకములకు తల్లులగు ఇరవై నల్గురు కన్యలను కనెను (9).

శ్రద్ధా లక్ష్మీర్ధృతిః పుష్టిస్తుష్టిర్మేధా క్రియా తథా | బుద్ధిర్లజ్జా వపుశ్శాంతిస్సిద్ధిః కీర్తిస్త్రయోదశీ || 10

పత్న్యర్థం ప్రతిజగ్రాహ ధర్మో దాక్షాయణీః ప్రభుః | తాభ్యశ్శిష్టా యవీయస్య ఏకాదశ సులోచనాః || 11

ఖ్యాతిస్సత్యర్థసంభూతిస్స్మృతిః ప్రీతిః క్షమా తథా |
సన్నతిశ్చానసూయా చ ఊర్జా స్వాహా స్వధా తథా || 12

భృగుశ్శర్వో మరీచిశ్చ అంగిరాః పులహః క్రతుః |
పులస్త్యో%త్రిర్వసిష్ఠశ్చ పావకః పితరస్తథా || 13

ఖ్యాత్యాద్యా జగృహుః కన్యా మునయో మునిసత్తమాః | కామాద్యాస్తు యశోం%తా యే తే త్రయోదశసూనవః || 14

ధర్మస్య జజ్ఞిరే తాసు శ్రద్ధాద్యాస్సుసుఖోత్తరాః | దుఃఖోత్తరాశ్చ హింసాయామధర్మస్య చ సంతతౌ || 15

నికృత్యాదయ ఉత్పన్నాః పుత్రాశ్చాధర్మలక్షణాః | నైషాం భార్యాశ్చ పుత్రా వా సర్వే త్వనియామాస్స్మృతాః || 16

స ఏష తామసస్సర్గో జజ్ఞే ధర్మనియామకః | యా సాదక్షస్య దుహితా రుద్రస్య దయితా సతీ || 17

భర్తృనిందాప్రసంగేన త్యక్త్వా దాక్షాయణీం తనుమ్ | దక్షం చ దక్షభార్యాం చ వినింద్య సహ బంధుభిః || 18

సా మేనాయామావిరభూత్పుత్రీ హిమవతో గిరేః | రుద్రస్తు తాం సతీం దృష్ట్వా రుద్రాంస్త్వాత్మసమప్రభాన్ || 19

యథా%సృజదసంఖ్యాతాంస్తథా కథితమేవ చ | భృగోః ఖ్యాత్యాం సముత్పన్నా లక్ష్మీర్నారాయణప్రియా || 20

దేవౌ ధాతృవిధాతారౌ మన్వంతరవిధారిణౌ | తయోర్వై పుత్రపౌత్రాద్యాశ్శతశో%థ సహస్రశః || 21

స్వాయంభువేం%తరే నీతాస్సర్వే తే భార్గవా మతాః | మరీచేరపి సంభూతిః పౌర్ణమాసమసూయత || 22

శ్రద్ధ, లక్ష్మి, ధృతి, తుష్టి, మేధ, క్రియ, బుద్ధి, లజ్జ, వపువు, శాంతి, సిద్ధి, కీర్తి అనే పదముగ్గురు (10) దక్షపుత్రికలను ధర్మప్రభుడు భార్యలనుగా స్వీకరించెను. వారి తరువాత వారి చెల్లెళ్లు పదకొండు మంది సుందరయువతులు మిగిలియుండిరి (11). ఖ్యాతి, సతి, అర్ధసంభూతి, స్మృతి, ప్రీతి, క్షమ, సన్నతి, అనసూయ, ఊర్జ, స్వాహా, స్వధా అనునవి వారి పేర్లు (12). ఓ మహర్షులారా!భృగువు, శివుడు మరియు మరీచి, అంగిరసుడు, పులహుడు, క్రతువు,

పులస్త్యుడు, అత్రి, వసిష్ఠుడు అనే ఏడ్గురు ఋషులు, అగ్ని, పితృదేవతలు అనువారలు ఆ ఖ్యాతి మొదలగు కన్యలను క్రమముగా వివాహమాడిరి. కామునితో మొదలిడి, యశస్సు వరకు గల పదముగ్గురు పుత్రులను ధర్ముడు శ్రద్ధ మొదలగు వారియందు కనెను. వీరు ఒకరికంటె అధికమగు సుఖమును మరియొకరు ఇచ్చెదరు. అధర్మునకు హింసయందు నికృతి మొదలగు అధర్మస్వభావము గల సంతానము కలిగిరి. వీరు ఒకరిని మించి మరియొకరు దుఃఖమును కలిగించెదరు. ఏ విధమైననియమములు లేని వీరికి అందరికి భార్యలు గాని, పిల్లలు గాని లేరు (13-16). ఈ విధముగా ధర్మమును నియంత్రించే ఈ తామసస్సృష్టి జరిగినది. దక్షుని పుత్రి, రుద్రుని భార్య యగు సతి (17) భర్త నిందింపబడిన సందర్భములో బంధువులతో కూడియున్న దక్షుని మరియు ఆయన భార్యను నిందించి, తన దేహమును విడిచిపెట్టి (18), పర్వతరాజగు హిమవంతునకు మేనయందు పుత్రికయై అవతరించెను. రుద్రుడు ఆ సతీదేవియొక్క అవస్థను చూచుట, తనతో సమానమగు కాంతి గల భయంకరాకారులను (19) లెక్క లేనంతమందిని సృష్టించుట మొదలైన వృత్తాంతము పూర్వమే చెప్పబడినది. భృగువునకు ఖ్యాతి యందు నారాయణునకు ప్రియురాలగు లక్ష్మీదేవి, మరియు ధాత విధాత అనే ఇద్దరు దేవతలు జన్మించిరి. మన్వంతరమును నిలబెట్టిన వీరిద్దరికి వందల వేల సంఖ్యలో కొడుకులు మరియు మనుమలు కలిగిరి (20,21). స్వాయంభవమన్వంతరములో నివసించిన వారందరికి భార్గవులు (భృగువంశమునందు పుట్టినవారు) అని పేరు. మరీచికి సంభూతియందు పౌర్ణమాసుడు జన్మించెను (22).

కన్యాచతుష్టయే చైవ మహీయాంసస్తదన్వయాః | యేషాం వంశే సముత్పన్నో బహుపుత్రస్స కశ్యపః || 23

స్మృతిశ్చాంగిరసః పత్నీ జనయామాస వై సుతౌ | ఆగ్నీధ్రం శరభం చైవ తథా కన్యాచతుష్టయమ్ || 24

తదీయాః పుత్రపౌత్రాశ్చ యే%తీతాస్తే సహస్రశః | ప్రీత్యాం పులస్త్యభార్యాయాం దంతోగ్నిరభవత్సుతః |

పూర్వజన్మని యో % గస్త్యస్స్మృతస్స్వాయంభవవేం%తరే || 25

తత్సంతతీయా బహవః పౌలస్త్యా ఇతి విశ్రుతాః | క్షమా తు సుషువే పుత్రాన్ పులహస్య ప్రజాపతేః || 26

కర్దమశ్చాసురిశ్చైవ సహిష్ణుశ్చేతి తే త్రయః | త్రేతాగ్నివర్చసస్సర్వే యేషాం వంశః ప్రతిష్ఠితః || 27

క్రతోః క్రతుసమాన్ భార్యా సన్నతిస్సుషువే సుతాన్ | నైషాం భార్యాశ్చ పుత్రాశ్చ సర్వే తే హ్యూర్ధ్వ రేతసః || 28

షష్టిస్తాని సహస్రాణి వాలఖిల్యా ఇతి స్మృతాః | అనూరోరగ్రతో యాంతి పరివార్య దివాకరమ్ || 29

ఆత్రేర్భార్యా%నసూయా చ పంచాత్రేయానసూయత | కన్యాకాం చ శ్రుతిం నామ మాతా శంఖపదస్య చ || 30

సత్యనేత్రశ్చ హవ్యశ్చ ఆపోమూర్తిశ్శనైశ్చరః | సోమశ్చ పంచమస్త్వేతే పంచాత్రేయాః ప్రకీర్తితాః || 31

తేషాం పుత్రాశ్చ పౌత్రాశ్చ హ్యాత్రేయాణాం మహాత్మనామ్ | స్వాయంభువేం%తరే % తీతాశ్శతశోథ సహస్రశః || 32

ఊర్జాయాం తు వసిష్ఠస్య పుత్రా వై సప్త జజ్ఞిరే | జ్యాయసీ చ స్వసా తేషాం పుండరీకా సుమధ్యమా || 33

ఆయనకు నల్గురు కుమార్తెలు కూడ గలరు. ఆ వంశమువారు చాల గొప్పవారు. వారి వంశములోననే అనేకపుత్రులు గల కశ్యపుడు జన్మించెను (23). అంగిరసుని భార్యయగు స్మృతికి అగ్నీధ్రుడు, శరభుడు అనే ఇద్దరు కొడుకులు మరియు నల్గురు కుమార్తెలు కలిగిరి (24). వారి కొడుకులు, మనుమలు వేల సంఖ్యలో గలరు. వారు

కాలగర్భములో కలిసి పోయిరి. పులస్త్యుని భార్యయగు ప్రీతికి దంతోగ్ని అనే కొడుకు కలిగెను. ఆయన పూర్వజన్మలో స్వాయంభువమన్వంతరములో అగస్త్యుడని చెప్పబడినది (25). ఆయనకు పౌలస్త్యులు అని ప్రఖ్యాతిని గాంచిన అనేకులు సంతానము గలరు. పులహప్రజాపతికి భార్యయగు క్షమయందు కర్దముడు, ఆసురి, సహిష్ణుడు అనే ముగ్గురు కొడుకులు కలిగిరి. వారందరు యజ్ఞాగ్నితో సమానమగు కాంతి గలవారు. వారి వంశము ప్రతిష్ఠను పొందినది (26, 27). క్రతువుయొక్క భార్యయగు సన్నతి యజ్ఞమువలె పవిత్రులైన కొడుకులను కనెను. వారందరు నైష్ఠికబ్రహ్మచారులగుటచే, వారికి భార్యలు గాని పిల్లలు గాని లేరు (28). వాలఖిల్యులని చెప్పబడే ఆ మహాత్ముల సంఖ్య అరవై వేలు. వారు సూర్యుని ప్రదక్షిణము చేసి అనూరునకు (సూర్యుని సారథి) ముందు నడచెదరు (29). అత్రియొక్క భార్యయగు అనసూయ అయిదుగురు ఆత్రేయులనే పుత్రులను, శ్రుతి అనే కన్యను కనెను. శ్రుతియొక్క పుత్రుడు శంఖపదుడు (30). సత్యనేత్రుడు, హవ్యుడు, ఆపోమూర్తి, శ##నైశ్చరుడు, సోముడు అను అయిదుగురు ఆత్రేయులని కీర్తింపబడచున్నారు (31). మహాత్ములగు ఆ ఆత్రేయులకు స్వాయంభువమన్వంతరములో వందల వేల సంఖ్యలో కొడుకులు, మనుమలు కలిగిరి. వారు కాలగర్భములో కలిసిపోయిరి (32). వసిష్ఠునకు ఊర్జయందు ఏడ్గురు కొడుకులు కలిగిరి. పుండరీక అనే సుందరి వారికి పెద్ద అక్క గారు (33).

రజోగాత్రోర్ధ్వబాహూచ సవనశ్చానయశ్చ యః | సుతపాశ్శుక్ర ఇత్యేతే సప్త సప్తర్షయస్స్మృతాః || 34

గోత్రాణి నామభిస్తేషాం వాసిష్ఠానాం మహాత్మానామ్ |
స్వాయంభువే%ంతరే%తీతాన్యర్బుదాని శతాని చ || 35

ఇత్యేష ఋషిసర్గస్తు సానుబంధః ప్రకీర్తితః |
సమాసాద్విస్తరాద్వక్తుమశక్యో%యమితి ద్విజాః || 36

యో%సౌ రుద్రాత్మకో వహ్నిర్బ్రహ్మణో మానసస్సుతః | స్వాహా తస్య ప్రియా లేభే పుత్రాంస్త్రీన్ నమితౌ జసః || 37

పావకః పవమానశ్చ శుచిరిత్యేష తే త్రయః | నిర్మథ్యః పవమానస్స్యాద్వైద్యుతః పావకస్స్మృతః || 38

సూర్యే తపతి యశ్చాసౌ శుచిస్సౌర ఉదాహృతః | హవ్యవాహః కవ్యవాహస్సహరక్షా ఇతి త్రయః || 39

త్రయాణాం క్రమశః పుత్రా దేవపిత్రసురాశ్చ తే | ఏతేషాం పుత్రపౌత్రాశ్చ చత్వారింశన్నవైవ తే || 40

కామ్యనైమిత్తికాజస్రకర్మసు త్రిషు సంస్థితాః | సర్వే తపస్వినో జ్ఞేయాస్సర్వే వ్రతభృతస్తథా || 41

సర్వే రుద్రాత్మకాశ్చైవ సర్వే రుద్రపరాయణాః | తస్మాదగ్నిముఖే యత్తద్ధుతం స్యాదేవ కేనచిత్ || 42

తత్సర్వం రుద్రముద్దిశ్య దత్తం స్యాన్నాత్ర సంశయః | ఇత్యేవం నిశ్చయో%గ్నీనామనుక్రాంతో యథాతథమ్ || 43

రజస్సు, గాత్రుడు, ఊర్ధ్వబాహుడు, సవనుడు, అనయుడు, సుతపసుడు, శుక్రుడు అనునవి ఆ ఏడ్గురు ఋషుల పేర్లు (34). మహాత్ములగు ఆ వసిష్ఠపుత్రులయొక్క గోత్రనామములు స్వాయంభువమన్వంతరములో వేల కోట్ల సంఖ్యలో ఉండెను. వారందరు కాలగర్భములో కలిసిరి (35). ఓ బ్రాహ్మణులారా! ఈ విధముగా వంశసంతతితో కూడియున్న ఋషిసర్గమును విస్తరముగా వర్ణించుట శక్యము కాదు. కావుననే, సంగ్రహముగా వర్ణించితిని (36). బ్రహ్మమానసపుత్రుడు మరియు రుద్రస్వరూపుడు అగు అగ్నికి ఆయనయొక్క ప్రియురాలగు స్వాహాదేవియందు సాటిలేని తేజస్సు గల ముగ్గురు కుమారులు కలిగిరి (37). పావకుడు, పవమానుడు, శుచి అనునవి ఆ ముగ్గురి పేర్లు. మంథనమునందు పుట్టే అగ్నికి పవమానుడని పేరు. మెరుపులో పుట్టే అగ్నికి పావకుడని పేరు (38).

సూర్య ప్రకాశమునందు గల తేజస్సునకు శుచి అని పేరు. వీరి ముగ్గురికి క్రమముగా హవ్యవాహుడు, కవ్యవాహుడు, సహరక్షుడు అనే ముగ్గురు కొడుకులు కలిగిరి. వారు క్రమముగా దేవతలు, పితృదేవతలు, అసురులు అను వర్గములకు చెందినవారు. వారికి నలభై తొమ్మిదిమంది కొడుకులు, మనుమలు గలరు (39, 40). వీరు క్రమముగా కామ్య (కోరిక సిద్ధించుటకై చేయబడునవి), నైమిత్తిక (ఒకానొక నిమిత్తము లేక సందర్భమును పురస్కరించుకొని చేయబడునవి), నిత్య (తప్పని సరిగా చేయదగినవి) కర్మలు అనే మూడు రకముల కర్మలయందు ప్రతిష్ఠితులై యుందురు. వీరందరు తపశ్శాలులు మరియు వ్రతనిష్ఠ గలవారు అని తెలియదగును (41). రుద్రునియందు నిష్ఠ గల వీరు అందరు రుద్రస్వరూపులే. కావున, ఎవడైననూ అగ్నియొక్క నోటియందు ఏయే ఆహుతులను సమర్పించునో, ఆ సర్వము నిస్సందేహముగా రుద్రుని ఉద్దేశించి మాత్రమే సమర్పించినట్లగును. ఈ విధముగా అగ్నుల నిశ్చయము ఉన్నది ఉన్నట్లుగా క్రమములో చెప్పబడినది (42, 43).

నాతివిస్తరతో విప్రాః పితౄన్ వక్ష్యామ్యతః పరమ్ | యస్మాత్ షడృతవస్తేషాం స్థానం స్థానాభిమానినామ్ || 44

ఋతవః పితరస్తస్మాదిత్యేషా వైదికీ శ్రుతిః | యస్మాదృతుషు సర్వే హి జాయంతే స్థాస్నుజంగమాః || 45

తస్మాదేతే హి పితర ఆర్తవా ఇతి చ శ్రుతమ్ | ఏవం పితౄణామేతేషామృతుకాలాభిమానినామ్ || 46

ఆత్మైశ్వర్యా మహాత్మానస్తిష్ఠంతీహాభ్రసంగమాత్ | అగ్నిష్వాత్తా బర్హిషదః పితరో ద్వివిధాస్స్మృతాః || 47

అయజ్వానశ్చ యజ్వానః క్రమాత్తే గృహమేధినః | స్వధా%సూత పితృభ్యశ్చ ద్వే కన్యే లోకవిశ్రుతే || 48

మేనాం చ ధరణీం చైవ యాభ్యాం విశ్వమిదం ధృతమ్ |
అగ్నిష్వాత్తసుతా మేనా ధరణీ బర్హిషత్సుతా || 49

మేనా హిమవతః పత్నీ మైనాకం క్రౌంచమేవ చ | గౌరీం గంగాం చ సుషువే భవాంగాశ్లేషపావనీమ్ || 50

మేరోస్తు ధరణీ పత్నీ దివ్యౌషధిసమన్వితమ్ | మందరం సుషువే పుత్రం చిత్రసుందరకంధరమ్ || 51

స ఏవ మందరః శ్రీమాన్ మేరుపుత్రస్తపోబలాత్ |
సాక్షాచ్ఛ్రీకంఠనాథస్య శివస్యావసథం గతః || 52

సా%సూత ధరణీ భూయస్తిస్రః కన్యాశ్చ విశ్రుతాః | వేలాం చ నియతిం చైవ తృతీయమపి చాయతిమ్ || 53

ఆయతిర్నియతిశ్చైవ పత్న్యౌ ద్వే భృగుపుత్రయోః |
స్వాయంభువేం%తరే పూర్వం కథితస్తే తదన్వయః || 54

ఓ బ్రాహ్మణులారా! ఈ పైన పితృదేవతలను గురించి ఎక్కువ విస్తారము కాకుండగా చెప్పెదను. పితృదేవతలకు స్థానము ఆరు ఋతువులు. ఈ ఋతువులు అనే స్థానమునందు వారికి అభిమానము (నాది అనే భావన) గలదు (44). కావున, ఋతువులే పితృదేవతలు అగుదురని వేదమంత్రములలో వినబడుచున్నది. చరాచరప్రాణులన్నియు ఋతువులయందు మాత్రమే జన్మించుచున్నవి (45). కావున, ఈ పితృదేవతలు ఆర్తవులు (ఋతువుల అభిమాని దేవతలు) అని వేదము చెప్పుచున్నది. ఈ విధముగా ఋతువులు అనే కాలాంశములకు అభిమాని దేవతలగు పితరులలో అగ్నిష్వాత్తులు, బర్హిషదులు అనే రెండు రకములు గలరని మహర్షులు చెప్పెదరు. మేఘములతో కలిసి ఉండే ఈ పితృదేవతలు ఆత్మజ్ఞానము అనే ఐశ్వర్యము గల మహాత్ములు (46, 47). గృహస్థులగు ఆ రెండు రకముల పితరులలో రెండవ వారు యజ్ఞయాగములను చేసినవారు కాగా, మొదటి వారు అట్లు కాదు.

పితృదేవతలకు స్వధయందు లోకప్రఖ్యాతిని గాంచిన ఇద్దరు కుమార్తెలు కలిగిరి (48). మేన, ధరణి అనునవి వారి పేర్లు. వారిద్దరు ఈ జగత్తునంతనూ నిలబెట్టినారు. మేన అగ్నిష్వాత్తుల పుత్రిక కాగా, ధరణి బర్హిషదుల పుత్రిక (49). హిమవంతుని భార్యయగు మేన మైనాకుడు, క్రౌంచుడు అను పుత్రులను, గౌరి, గంగ అనే పుత్రికలను కనెను. శివుని శరీరమును ఆలింగనము చేయుటచే గంగ పావని యైనది (50). మేరువుయొక్క భార్యయగు ధరణి దివ్యమగు ఓషధులతో నిండియున్నవాడు, రంగు రంగుల అందమైన శిఖరములు గలవాడు అగు మందరుని పుత్రునిగా కనెను (51). శోభాయుక్తుడు, మేరుపుత్రుడు అగు ఆ మందరుడే తపస్సుయొక్క బలముచే కంఠమునందు విషముగల జగన్నాథుడగు శివునకు సాక్షాత్తుగా నివాసస్థానమైనాడు (52). ఆ ధరణి మరల వేల, నియతి మరియు ఆయతి అనే ముగ్గురు లోకప్రఖ్యాతిని గాంచిన కన్యలను కనెను (53). ఆయతి, నియతి అను వారిద్దరు భృగువుయొక్క పుత్రులకు ఇద్దరికి భార్యలు అయినారు. వారి వంశమును గురించి పూర్వము నేను స్వాయంభువ మన్వంతర ప్రసంగములో చెప్పియుంటిని (54).

సుషువే సాగరాద్వేలా కన్యామేకామనిందితామ్ | సవర్ణాం నామ సాముద్రీం పత్నీం ప్రాచీనబర్హిషః || 55

సాముద్రీ సుషువే పుత్రాన్ దశ ప్రాచీనబర్హిషః | సర్వే ప్రాచేతసా నామ ధనుర్వేదస్య పారగాః || 56

యేషాం స్వాయంభువే దక్షః పుత్రత్వమగమత్పురా | త్రియంబకస్య శాపేన చాక్షుషస్యాంతరే మనోః || 57

ఇత్యేతే బ్రహ్మపుత్రాణాం ధర్మాదీనాం మహాత్మనామ్ | నాతిసంక్షేపతో విప్రా నాతివిస్తరతః క్రమాత్|| 58

వర్ణితా వై మయా వంశా దివ్యా దేవగణాన్వితాః | క్రియావంతః ప్రజావంతో మహర్ధిభిరలంకృతాః || 59

ప్రజానాం సంనివేశో%యం ప్రజాపతిసముద్భవః | న హి శక్యః ప్రసంఖ్యాతుం వర్షకోటిశ##త్రైరపి || 60

రాజ్ఞామపి చ యో వంశో ద్విధా సో%పి ప్రవర్తత | సూర్యవంశస్సోమవంశ ఇతి పుణ్యతమః క్షితౌ || 61

ఇక్ష్వాకురంబరీషశ్చ యయాతిర్నాహుషాదయః | పుణ్యశ్లోకాః శ్రుతా యే%త్ర తే%పి తద్వంశసంభవాః || 62

అన్యే చ రాజఋుషయో నానావీర్యసమన్వితాః | కిం త్రైః ఫలమనుత్ర్కాంత్రైరుక్తపూర్వైః పురాతనైః || 63

కిం చేశ్వరకథావృత్తౌ యత్ర తత్రాన్యకీర్తనమ్ | న సద్భిస్సంమతం మత్వానోత్స హే బహు భాషితమ్ || 64

ప్రసంగాదీశ్వరస్సై#్యవ ప్రభావద్యోతనాదపి | సర్గాదయో%పి కథితా ఇత్యత్ర తత్ర్పవిస్తరైః || 65

ఇతి శ్రీశివమహాపురాణ వాయవీయసంహితాయాం పూర్వభాగే సృష్టికథనం నామ సప్తదశో%ధ్యాయః (17)

వేల సాగరునితో కలిసి ఒక సుందరియగు కన్యను కనెను. సవర్ణ అనే పేరుగల ఆ సముద్రపుత్రి ప్రాచీనబర్హిషుని భార్య అయెను (55). ప్రాచీనబర్హిషునకు ఆ సముద్రపుత్రియందు పది మంది కొడుకులు కలిగిరి. వారికి ప్రాచేతసులు అని పేరు. వారు ధనుర్వేదములో దిట్టలు (56). స్వాయంభువమన్వంతరములోని దక్షుడు శివుని శాపము వలన పూర్వము చాక్షుషమన్వంతరములో వారికి పుత్రుడు అయెను (57). ఓ బ్రాహ్మణులారా! ఇంతవరకు మీకు ఈ ధర్ముడు మొదలగు మహాత్ములయొక్క వృత్తాంతమును మిక్కిలి సంక్షేపము కాకుండగా మరియు అతివిస్తారము కాకుండగా వరుసగా చెప్పితిని (58). దేవగణములతో కూడియున్నవి, వైదికకర్మానుష్ఠానముతో కూడినవి, సంతానవంతములు, గొప్ప భోగభాగ్యములతో తులదూగునవి అగు దివ్యవంశములను నేను వర్ణించి చెప్పితిని

(59). ప్రజాపతినుండి పుట్టిన ఈ సంతానసమూహమును వందల కోట్ల సంవత్సరముల కాలములోనైననూ ఖచ్చితముగా లెక్కించుట సంభవము కాదు (60). భూలోకములో మిక్కిలి పవిత్రమైన రాజుల వంశము కూడ సూర్యవంశము, చంద్రవంశము అనే రెండు శాఖలను కలిగియున్నది (61). ఇక్ష్వాకువు, అంబరీషుడు, నహుషుని పుత్రుడగు యయాతి మొదలగు పవిత్రకీర్తి గల ఏ రాజులు లోకములో ప్రఖ్యాతిని గాంచియున్నారో, మరియు అనేకశక్తిసామర్థ్యములు గల ఏ ఇతరరాజర్షులు గలరో, వారు కూడ ఆ వంశములకు చెందినవారే. మరణరహితులగు ఆ పురాతనచక్రవర్తులను గురించి పూర్వములో చెప్పియుంటిని. మరల వారిని గురించి చెప్పుటలో ఫలమేమి గలదు? (62, 63). ఇంతే గాక, ఈశ్వరుని కథను చెప్పే సందర్భములో అనేకములగు ఇతరవిషయములను గురించి అధికప్రసంగమును చేయుట సత్పురుషులకు సమ్మతము కాబోదని తలంచి నేను ఆ వివరములను ఉత్సాహముతో చెప్పుట లేదు (64). ఈశ్వరుని మహిమను కళ్లకు కట్టినట్లు వర్ణించే సందర్భమును పురస్కరించు కొని మాత్రమే నేను సృష్టి మొదలగు వాటిని గురించి చెప్పితిని. ఆవివరములు కూడ ఇక చాలును (65).

శ్రీ శివమహాపురాణములోని వాయవీయసంహితయందు పూర్వభాగములో సృష్టిని వర్ణించే పదునేడవ అధ్యాయము ముగిసినది (17).